ప్రచురణం ౨౦

# గుమస్తా

శ్రీ జంపన

ప్రాప్తి:
వెంకటేశ్వర
పబ్లిషింగ్ హౌస్,
ప్రొ. యం. వి. అప్పారావు
అండ్ సన్స్, రాజమండ్రి.

# గుమస్తా

శ్రీ కంపన చంద్రశేఖరరావు
యం. ఏ. బి. ఇడి.
ఏలూరు,

ప్రథమముద్రణ
ప్ర. 1000 లు.



అంకితం.

అనురాగరసనిధి
మా రత్తయ్య మామయ్యకు—
(శ్రీ పినిశెట్టి రత్తయ్యనాయుడుగారికి, (పాలకొల్లు)

జంపన.

అన్ని హక్కులు.
శ్రీ వేంకటేశ్వర పబ్లిషింగ్ హౌస్;
రాజమండ్రి.

మూల్యం;
ఎనిమిదణాలు

శ్రీనివాసా ప్రెస్,
రాజమండ్రి.

1

“ ఈసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయ్;
తిండి కలిగితె కండగలదోయ్
కండగలవాడేను మనిషోయ్ ”

—మహాకవి శ్రీగురజాడ అప్పారావుగారు.

పర్వతాలు పర్వతాలే పగలగొట్టి, బండలు ముక్కలుచేసి, రాళ్ళుపరచి రోడ్లువేసే ఉప్పరోళ్ళ చెమటబిందువులకు విలువలేదు. మండుటెండలో మలమల మాడుతూ, వంటినిండాబట్ట, కడుపునిండా తిండీ లేకుండా, మగా ఆడా అనకుండా పిల్లాజల్లలతో, రెక్కలు ముక్కలయ్యేటట్లు అంతా కష్టపడతారే. వారి కష్టాలకు-కన్నీళ్ళకు విలువుందా! రోడ్లు పరిచింది వాళ్ళయినా పేరుదక్కేది కంట్రాక్టర్లకు, ఇంజనీర్లకు, ప్రెసిడెంటులకే! పైపెచ్చు ఆ కష్టజీవులను త్రాగుబోతులూ, గుండాగొయ్యిలూ అని నిందిస్తారు? ఎక్కడుంది ధర్మం?

♦ ♦ ♦ ♦

భూమి చీల్చి, నాగటిమొనతో తమ పేరునాటి, చెమటబిందువులతో విత్తునాటి, కన్నీటి వర్షపుజల్లుతో మొక్కపెంచి, నెత్తురోడ్చి ధాన్యం ఊడ్చే పేదరైతులకు తిండిలేదు. భూస్వాములు, జమీందారు కొట్లలో ధాన్యపుసంచులు నిలవుంచుతారు. రైతులు క్షామపీడితులై ముష్టెత్తుతారు. ఏ గొప్ప దొరైనా వస్తే “ఈ భూములన్నీ మనవేనండీ” అని బోరలు విరిచి చెబుతారు భూస్వాములూ, జమీందారులు. కర్షకులకు కూలి; కామందులకు పేరు; ఎక్కడుంది న్యాయం?

♦ ♦ ♦ ♦

కోడి కూతకంటే ముందు మిల్లు కూస్తుంది. పగలు పగలల్లా పడిన శ్రమచే అలిసిపోయి, గట్టిగా రెప్పల తలుపులు బిగించి కళ్ళు నిదరపోతూంటే- కేపిటలిస్ట్ అయిన మనసువచ్చి, రెప్పల తలుపులను బలవంతంగా తెరపించి, కళ్ళను మేల్కొల్పి కార్యరంగంలోకి దింపుతుంది—

అక్కడనుంచీ ఆ గాలిలోయే కూలీల పాటల్లో కలకలాలు. ఎండిపోయిన ఎముకల పంజరాలను చాపలమీదనుంచి లేవదీస్తారు. అంతే, ఆరిపోయిన బుగ్గలతో, లోతుకుపోయిన కళ్ళతో, మాసిన తలలతో, చినిగినబట్టలతో, ఉట్టిలోఉన్న గంజికూటి ముంతలు తీసుకొని పొట్టకూటికి బయలుదేరతారు కార్మికులు.

గోధుమ రంగుగాఉన్న ధాన్యంపొట్టు వలిచి తెల్లని బియ్యాం చేస్తారు. రాసులకు రాసులు పోస్తారు. కాని చారెడు నూకలైనా తీసుకుపోలేరు. ఆ తెల్లని బియ్యంచూస్తూ, మాడిన కడుపులతో, ఇళ్ళకు పోతారే. ఎంత ఘోరం? యజమానిఇచ్చే రూపాయి డబ్బులూ ఈకరువు రోజుల్లో పొట్టకు సరిపోతాయా?

ధూళితోటీ, గింజలతోటీ ఉన్న నూలును శుభ్రపరిచి, దారం తీసి, బట్టలు నేస్తారు. కొత్తకొత్త రంగుల బట్టలు కోట్లకొలదీ మేట్లు పడతాయ్. వాటినన్నిటినీ, చూస్తూ ఆచిరిగిన బట్టలతోనే ఇంటికి "మనకర్మ" అనుకుంటూ పోతారే- ఎంతఅన్యాయం? తమ కష్టం విడిచి తాము రిక్తహస్తాలతో ఇళ్లకు పోతున్నారంటే ఎంతబాధో హృదయాలుంటే భావించండి.

గోధుమలు పిండిచేస్తారు. గుప్పెడుపిండి లభించదు— అలా సృష్టికి కావలసినన్ని మిల్లుల్లో తయారు చేస్తారు. కాని వాళ్ళు అనుభవించలేరు.

రెండు వేల కూలీలున్నా మిల్లు యజమాని రోజుకు షుమారు ఆరు వేల రూపాయిలు గడిస్తున్నాడు. ఆ ఆరు వేల రూపాయలు పెట్టి మరనాడు పద్దెనిమి వేల రూపాయలు గడిస్తున్నాడు

కాని మన కష్టజీవికి ఎప్పుడూ చాలీచాలని దిన వెచ్చమే. మిల్లుయజమానుల కోటీశ్వరులౌతూఉంటే, కూలీలు తిండిలేక చస్తున్నారు ఏకూలీ అయినా, ఈ విధానంగా 'కూలీ' (Wages) పద్ధతులుంటే ఒక్కబంగారు కాసు చూడగలడా? వంటినిండా బట్టకట్టగలడా? కడుపునిండా తిండి తినగలడా? వానకారని ఇంటిలో ఉండగలడా?

ఒక్కసారి చక్కగా విమర్శించిచూడండి...ఏ కార్మికులకైనా, ఏ కర్షకులకైనా కడుపునిండా భోజనం ఉందేమో!

ఇంత నవనాగరక దేశంలోనూ చొక్కాలున్నయ్యా రైతులకు? నల్లని మన గుడ్డలు పోయినయ్యా కార్మికులకు!

నేటికీ 'ఇది పూర్వజన్మకర్మ; మన తలరాత' అంటున్నారే గాని—ఈ కలిమి లేముల స్వార్థపరుల కల్పితాలేగాని, భగవల్లిఖతాలు" కావని గ్రహిస్తున్నారా? గ్రహించేటట్లు వారికి విద్యావిధానం ప్రభుత్వం ఏర్పరచిందా?

"బాబూ! నీవు పేదవాడిగా పుట్టలేదోయ్. నిన్ను పేదవానిగా ఈ ధనిక సంఘం చేసింది.

తల్లీ! చక్కని పిల్లల్ని దేశానికి ప్రసాదిస్తున్నావ్. ఎఱ్ఱని నెత్తురంతా తెల్లని పాలుగా మార్చి బిడ్డలకు కండపుష్టి కలిగిస్తున్నావ్. కాని కొత్తనెత్తురు పట్టడానికి కావలసినంత తిండి తినకుండా చస్తున్నావ్. నీవు అర్ధాయుష్షుతోనే చావడానికి పుట్టలేదు తల్లీ! అందరిలాగే నీవూ ఆరోగ్యంగా ఉండొచ్చు. నిన్ను నీచుట్టుపట్లున్న 'ధనిక వర్గమే పీల్చి పిప్పిచేస్తున్నది. నీలో ప్రతి రక్తకణాన్ని నీరుచేసేస్తున్నారు తల్లీ! నీ బిడ్డలకే విజ్ఞానజ్యోతిని కనబరుస్తే, దేశదారిద్ర్యం ఏనాడో తొలగిపోయి, స్వతంత్రశంఖం ఈనాటికి మనపిల్లలు పూరించకుండా

ఉండేవారా? స్వతంత్రపతాకం మనఇళ్లమీద ఎగరకుండా ఉండేదా? మన పాకలు మేడలు కావూ? మనమేడల్లో పుస్తక భాండా గారాలు వెలయవూ! తల్లీ! 'ఇదినీపూర్వజన్మకర్మ" కాదు. ఈజన్మకర్మే. కర్మం అంటే పని. ఈజన్మలో అవివేకివయి సేవచేస్తుంటే, చేయించుకుంటున్నారు కసాయివాళ్లు- ఏకసాయివానికి మేకపై ప్రేమఉంటుంది తల్లీ? ఆలోచించు— మేకపిల్లవుకాక సింహావుపిల్లవువా. నీలో అనంత శక్తులూ ఇమిడిఉన్నాయ్. కస్తూరిభాయ్, సరోజినీదేవివలె నీవూ గొప్పదానవు కాగలవు. గాంధీ, జవహర్, పటేల్, ఫూర్క్స్, స్టేలిన్, లెనిన్, బుద్ధ- వలె నీభర్త కూడా మహావీరుడు కాగలడమ్మా.

లే. అదిగో విజ్ఞాన జ్యోతి. చూడు తల్లీ! చూడు...అదిగో అటు చూడు. అదే స్వతంత్ర శంఖం. పూరించమ్మా! పూరించు... ఆపైనచూడు. అదే స్వతంత్ర పతాకం-మన పిల్లలందరితో కలిసి నీవూ నీభర్తా నమస్కరించండి తల్లీ! నమస్కరించండి." అని ఎవరు చెబుతున్నారు? ఎంతమంది కవులు తమ కావ్యాల్లో కష్టజీవుల విషాద బాధాజీవిత గాధలు వర్ణిస్తున్నారు?

ఆలోచించండి—

కవి సంఘరథాన్ని నడిపే సారధికాడూ? కాలాన్ని తన కావ్యంలో చిత్రించనవసరంలేదూ? నలభై కోట్లలో ముప్పై కోట్లమంది నిరక్షరాస్యులే. వారికి విజ్ఞానం కలిగి ప్రబోధాలు చేయొద్దూ? తిన తిండీ, కట్ట బట్టా, ఉండ ఇల్లూ లేకుండా, అనాథలై, అభాగ్యులై, అయ్యోయ్యో! జివచ్ఛవాల్లాగ చస్తున్నారే. వారలా చావవలసిందేనా? వారలా చస్తూంటే మీరు చూడవలసిందేనా? వారికి తిండీ, బట్టా, కలిగే మార్గాలు మీరు ఆలోచించరూ? మీకు తోచిన యదార్థాన్ని ముసుగుతీసి వారికి చూపించరూ?

మీరు కూడా 'వారికర్మ!' అంటే వారి గతేమిటి? మీరూ శ్రేష్టిలిస్టుల్లాగ 'ఎవరి కర్మకు ఎవరు కర్తలు!' అంటే వారికి మార్గం ఏమిటి?

కేవలం "మహాకవులం" అని అనిపించుకుంటానికేనా మన కావ్యరచన? సభలలో ఒకరి నొకరు "నీవు మహాకవివి" అంటే "నీవు మహాకవివి" అని పొగుడుకుంటానికేనా మనం కావ్యాలు వ్రాయవలసింది? సిగ్గేయడంలేదూ?

ప్రజలను విడిచి మీ కవిత్వం ఏమిటి? ప్రజల కష్టాలు వర్ణించని మీ కవిత్వం ఏ రాజు మెచ్చుకోను...

"మహాశిల్పం—దివ్యరచన - అలంకారాలు చూపించాలి—దివ్యశృంగారాలు చిత్రించాలి" అంటారా? చిత్రించండి. వద్దని ఎవరన్నారు? కాని ఇప్పుడు కాదు బాబూ ఇప్పుడుకాదు. .

కవీ!

నీ శృంగార కవిత్వాన్ని బంగారపు పెట్టిలోపెట్టి కడుపునిండా కూడు లభించేవరకూ దాచిఉంచి ఈలోపుగా చస్తానేమో అంటావా? ప్రజలకు పట్టెడన్నంకైనా పాటుపడని నీవంటివాడు చస్తేమాత్రం ఏం నష్టం? బెంగాల్, మలబార్, రాయిలసీమలలో రోజుకు లక్షలాదిగా ప్రజలు క్షుధాక్రాంతులై, క్షామదేవతకు బలి అయిపోవడంలేదూ? వారికంటే నీవు ఎక్కువా బాబూ!

నవకవీ!

మేలుకో! పాడుబూతుల పచ్చిశృంగారం ఎవరికి కావాలోయ్ వెఱ్ఱివెంగళప్పా! నీ పట్టుశాలువలు మూలపెట్టి-కూలీల గుడెసల్లో కాలుపెట్టు. వారి కన్నీటిలో నీరాతిగుండె కరగనీయ్. వారి నెత్తుటిలో నీ నెత్తురు పొంగనియ్. వారి హృదయ స్పందనాలతో నీ హృదయ స్పందనం జోడించు.

యుగకవీ!

చస్తున్నారోయ్ ప్రజలు తిండిలేక చస్తున్నారు. మతం పేరు చెప్పి ఎన్నో దురంతాలు చేశారు కొందరు వాళ్లలో నీవూ ఒకడవవు తావా!

యువకవీ!

జాతి కుల మత భేదాలు కల్పించి ప్రజలను పశువుల చేశారోయ్ పూర్వులుకొందరు. మనిషిని మనిషినుండి వేరుచెయ్యడం కాదోయ్ గొప్పతనం; కలపడం. ఏనాడో గాక్ - మహాకవి ఏమన్నాడు:

మతం వేరైతేను యేమోయ్,

మనసు లొకటై మనుషులుంటే.

గాంధీజీ ఏమన్నాడు:

"ఈ మూగ ప్రజలకు విజ్ఞానం కలగాలి. వాళ్ళూ మనుషులే అని ఆలోచించుకొనేటట్లు చెయ్యాలి"

చూశావా! విన్నావా!

ప్రజాభ్యుదయానికే నీకవిత్వం ఉపయోగించకపోతే కవివి కావు; నీటి కాకివి. కవిఅనే అర్థం దానికేమీ సాగదిపోదు—

---

## ii

"గుమస్తా."

విన్నావా ఈపదం షావుకార్!

ఇది వినని వాళ్ళున్నారా!



ఏపదిమంది గుమాస్తాలవల్ల నీవు కోటీశ్వరుడ వౌతున్నావో, ఆపదిమంది గుమాస్తాలకు ఏనాడైనా పదిరూపాయిల జీతం ఎక్కువ చేశావా? పదిమందికీ పదివేలు బహుమానంగా ఇచ్చావా? వారు లేకపోతే నీవు కాలుకదప గలవా? లెక్కవేయగలవా? నీకసలు అంకెలు వచ్చునా? పుస్తకాలు చదవడం వచ్చునా? భగవానుని ప్రార్థన చేయడం వచ్చునా?

అన్నిపనులూ చేసిపెట్టి నిన్ను కోటీశ్వరుని చేస్తున్నాడే, ఆగుమాస్తా మూడుపూటలా తిండి తింటున్నాడేమో ఎన్నడైనా అడిగావా? తినడం లేదని చెబితే నమ్మావా?

ఏమోయ్ షావుకార్!

నిజం చెప్పు? నీకూ- గొర్రెలూ మేకపోతులూ నరికి, మాంసం అమ్ముకొనేఆకసాయివానికీ భేదం ఏముందోయ్. కసాయివాళ్ళుచచ్చిన శవాలను కోసి అమ్ముతున్నారు- నీవు బ్రతికితిరిగే జీవచ్ఛవాలనే నీ ఇష్టం వచ్చినవాళ్ళకు అమ్ముకుంటున్నావ్. కడుపునిండా తిండి పెట్టకుండా ఇలా వేపుకు తినేదానికంటే, ఏబండకత్తితోటో వారి కుత్తుకలు కత్తిరించడం మేలు కాదోయ్!

ఆలోచించు—

నీకొట్లో పని చేస్తున్నాడు; నీయింట్లో పనిచేస్తున్నాడు. నీకు పనిచేస్తున్నాడు. అతని శరీరంలో ప్రతిరక్తనాళం "నీ" అనే బలివేదిక మీద బలిచేస్తున్నాడు.

పగలనక, రాత్రినక, నిన్నేదైవంగా పూజిస్తున్నాడు. నిన్నే ఇలవేల్పుగా ఆరాధిస్తున్నాడు నీకంటే అతనికి అన్యశరణం నాస్తి. నీవుఇచ్చే నెలజీతమే అతనిపొట్ట పోషిస్తుంది. అతని కుటుంబాన్ని నిలబెడుతుంది.

అటువంటప్పుడు- అతని పోషకుడవు నీవేకదా, అతని కడుపు నిండా అధమం మూడు పూటలా భోజనం అయినా పెట్టే బాధ్యత నీది కాదూ? షావుకారు ప్రభూ!

ఆలోచించు—

పోనీ నీకు అతనివల్ల లాభంలేకపోతే అనుకోవచ్చు. నీకు లేక పోయినా అనుకోవచ్చు. అతనివల్ల లక్షలు గడిస్తున్నావే, ఎందుకోయ్ అతన్ని భిక్షుకుని చేస్తున్నావ్. నీకులక్షలువస్తున్నాయ్. అని గ్రహించి అతడు కడుపుమాడ్చుకొని కన్నీరు కారుస్తున్నాడే హనుమంతునివంటి భక్తుని ఎంతగా ఏడిపిస్తున్నావోయ్! నీకు ధర్మంగాఉందా? ఈఆస్తి అంతా కట్టుకుపోవని— చచ్చిన నీతాతలవల్ల తెలియడంలేదూ?

బాబూ?

"వార్ బాండ్లకు, వేలువేలు గుమ్మరిస్తున్నావే. నీఇంటిముందు కుక్కలా తోకాడించుకుంటూ ఉన్న నమ్మిన బంటుకేమిస్తున్నావు?

నీవుచేసిన పాపాలన్నీ పోవడానికి గుడులు కట్టిస్తున్నావు. దీపా రాధనలు చేయిస్తున్నావు. అమ్మవారికి నగలుచేయిస్తున్నావు. తిరు పతి మొక్కులు తీరుస్తున్నావు. యాత్రలకువెళ్ళి ముడుపులు చెల్లిస్తు న్నావు. కాని నీభక్తునికి ఏమిస్తున్నావోయ్.

ఆలోచించు—

నీభక్తుడు కదిలే దేవాలయం. కదిలేదేవాలయాన్ని విడిచి కద లని దేవాలయానికి కనకగోపురం నిర్మిస్తానంటావేమిటి?

నీభక్తుడు సేవాలయం సేవించే సేవకుని విడిచి, సేవించని రాళ్ళకు మొక్కుతానంటావే?

షావుకార్?

ఒక్కటి చెబుతావిను. నీభక్తుడు గరుత్మంతుడు. అతని భుజ స్కంధంపై నీవు కూర్చున్నావు. అతనివల్లె నీవు ఆకాశపథాన్ని అం



టుకుంటున్నావు. ఆకాశపథాల్లో నక్షత్రంలా మెరిసిపోతున్నావు. అత నివలె ఎత్తయిన ప్రదేశాల్లో నీవునిలబడి అందరి కన్నులూ మిరిమిట్లు గొలుపుతున్నావు. కానిపైకి ఎగరగానే ఎవ్వరిమీద నీవునిలబడ్డావో అతణ్నే మరచిపోయావు.

ఆతడెప్పుడూ నీకంటే తక్కువే. నీకంటే కిందే ఉంటాడు. కాని నిమలంటే ఉంటాడు. అతడు తనరెక్కల జాడించుకొని ఆవలికిపో యాడా- నీగతిచూడు.

ఎక్కడుంటావు?

పాతాళ గహ్వరాంతర్భాగ తమోపదంలో-

నీలక్షలు ఏమౌతాయ్?

బుగ్గిపాలై భూమిలో రేణువుల్లా కలిసిపోతాయ్ అందుచేత షావుకారు?

నీబిడ్డవంటి గుమాస్తాకు కూడుగుడ్డలులేకుండా చేయకోయ్ బాబూ! చేయక. చేస్తే వచ్చేప్రమాదం నీకేగాని అతడికి కాదు.

నీశత్రువులనుండి నిన్ను రక్షించే నీచేతి కత్తివంటివాడు గుమా స్తా; ఆకత్తితో నీకుత్తుకే కోసుకుంటావా?

నీదొంగలనుండి నిన్ను కాపాడే నీఇంటిదీపం నీగుమాస్తా; నీ దీవంచేతే నీఇల్లుకాల్చుకుంటావా!

నీకంటే ముందు మేల్కొంటున్నాడు; నీకంటే వెనుక నిదర పోతున్నాడు; నీనీడగా ఉంటున్నాడు. ఆనీడతోటే నీకళ్ళు మూసు కుంటావా?

చెప్పు షావుకార్! చెప్పు
"ప్రేమించు ప్రేమకై -
ప్రేమించు శాంతికై"

---

## iii

అది షావుకార్ భద్రంగారి మహాభవనం.

చుట్టూ ప్రహారీ గోడలేదు. వంటింటి ప్రక్కనే పడకగది. పడకగదిలో పందిరిమంచం పందిరిమంచముకింద కిరసనాయిలడబ్బాలు వంచదార బస్తాలు, చింతపండు బుట్టలు, గదంతా బూజుమయం- ఆ గదిపక్కనే దేవుడుగది. దాని పక్కసావిడి, సావిట్లో గుమాస్తాలు. ఊరిలోకొట్టు. ఊరుబయటమిల్లు.

భద్రంగారిది ఒకవర్తకంకాదు; ఒకవ్యాపారంకాదు. రకరకాల వ్యాపారాలు చేస్తాడు. బట్టలకొట్టు దగ్గరనుంచి కిరాణా కొట్టువరకూ అన్నిరకాల వ్యాపారం అతనిదే.

యుద్ధానికిముందట భద్రం అంటే ఆవీధివారికే తెలీదు. ఏదో అక్కడక్కడ రెండుమూడు చిన్నకొట్టులూ, మిల్లులో ఒకభాగం అంతే......

యుద్ధానంతరం భద్రం అంటే తెలియనివారులేరు లక్షలకు లక్షలు గడించాడు.

యుద్ధం వల్ల పేదలు మరింత పేదలయ్యారు. ఆఫీసర్లు, ధని కులు మరింత ధనికులయ్యారు. పేదలకు వంటినిండా బట్టలేదు; గొప్ప వారికి వంటినిండా నగలే.

రేషనింగువల్ల వచ్చిన లాభం గొప్పవారికి వచ్చిన నష్టము పేదవారికే. ఎందుకంటే ఏ "బ్లాక్ మార్కెట్"లోనో గొప్పవాడు కొనగలడు; పేదవాడెలా కొంటాడు!

ఈ ఆఫీసర్లు, గొప్ప ధనికులు తమ తమ ఇళ్ళల్లో దాచిన ఆహారపదార్థాలు ధనరాసులవల్లనే దేశంలో క్షామం బయలుదేరింది. ఈ నాటికి కడుపునిండా భోజనంలేకుండా ప్రజలు అకలిదప్పులకు

అటమటించి పోతున్నారంటే దీనికి కారకులు స్వార్థపరులైన ఆఫీసర్లు ధనికవర్గం. ఇంతే. అంచేతే జవహర్‌లాల్ చెప్పినట్లు-అన్నంలేక శిలభాల్లా మాడి చావరాదు; అన్నంకొరకు పోరాడి, ఆపోరాటంలో ప్రాణాలు విడిచివెయ్యాలి. ఆహారపదార్థాలు నిలవ ఉంచుకొన్న ఏ వ్యక్తినీ విడువరాదు...

తన చుట్టూ ఉన్న ప్రజలు తిండిలేక చూస్తూంటే, తన గుమస్తాలు కదిలే ఎముకల గూళ్ళలా తయారైతే, సిగ్గూశరం లేకుండా భద్రం లక్షలు గడించుకుని నిలవచేసుకున్నాడు; వేలకొలది ప్రజలకు సరిపోయే ఆహారపదార్థాలను నిలవచేసుకున్నాడు.



తెల్లవారింది.

ఏడుగంటలయింది.

గుమస్తా సుబ్బన్న రాలేదని కారాలూ మిరియాలూ నూరుతూఉన్నాడు షావుకార్ భద్రం.

ఉదయం ఎనిమిది గంటలయింది.

గుమస్తా సుబ్బన్న ఇంకారాలేదు. భద్రం ఆగ్రహానికి అంతు లేదు; ఆనకట్టలు తెగిపోయాయ్. సుబ్బన్న రావడం రావడం అతని పైపడి, గొంతునులిపి, ప్రాణం తీయాలనుకున్నాడు. దానికి ఉపశ్రుతిగా అక్కడున్న నలుగురు గుమస్తాలపైనా నాలుగు అక్షింతలు వేశాడు. వారు లోలోన తిట్టుకుంటూ కుక్కిన పేనుల్లా కూర్చున్నారు...

ఉదయం తొమ్మిదిగంటలు దాటింది. సుబ్బన్న రాలేదు. నిప్పులు తొక్కిన కోతిలా గంతులు వేశాడు. ఇద్దరు గుమాస్తాలను పంపించాడు సుబ్బన్న ఇంటికి. వాళ్ళిలాగైనా యమకింకరుల్లా సుబ్బన్నను లాక్కొచ్చారు.

గుమ్మం ముందు వణికిపోతూ నిలబడ్డాడు సుబ్బన్న. భద్రం ఉరుములు గర్జిస్తున్నాడు సుబ్బన్న కనులలో మెరుపులు మెరుస్తున్నాయ్... మేఘాలు కమ్ముతున్నాయ్... వర్షపుచినుకులు రాలవచ్చు.

"ఏం సుబ్బన్నా! ఇంత ఆలశ్యం అయిందే!"

"నా అమ్మ—"

"ఊఁ ఏ!"

"మరణావస్థలో ఉందండీ'

"ఇంకా అవస్థలోనే ఉందా!"

"చిత్తం"

"ఎప్పుడు పోతుందోయ్'

"డాక్టర్ల మందులమీద భగవంతుని దయమీదా నాసంపాదనమీదా ఆధారపడి ఉందండి."

"నేనడిగేది జబ్బుకాదోయ్. మనిషి—మనిషి"

సుబ్బన్న హృదయాన్ని రాళ్ళతో చివరకొట్టినట్లయింది.'

"మాఅమ్మ ఎప్పుడుపోతుందో చెప్పాలా!" సుబ్బన్న కళ్ళమ్మట నీళ్లుతిరిగాయ్.

"పోయేవాళ్లనెవరాపకలరోయ్ పిచ్చోడ..."

"చిత్తం'

"సుబ్బన్నా! మీ అమ్మకొచ్చినభయం ఏమీలేదు. అమె ప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తా:

ఏలోకంలోనూ, ఎప్పుడూ జరగనివిషయం లెండిది. చరిత్రకు విరుద్ధం ఒకరిప్రాణానికి మరొకరిప్రాణం అడ్డువేయగలిగితే షాజహాన్ తనప్రాణానికంటే ఎక్కువగా ప్రేమించే ముంతాజ్‌మహల్‌కు తనప్రాణాన్ని అడ్డువేసి రక్షించుకోక..."

"మాటవరసకంటే..."

"అలాగా అండి—"

"సుబ్బన్నా! మంచిడాక్టర్ని పెడతా, నీవులేసిలోటు అన్ని విధాలా తీరుస్తా. కావలసినంతడబ్బా మంచినీళ్ళ ప్రవాహంకింద కర్చుపెడతా, ఇంకేం కావాలి?"

'ఇంతకూ నన్నేం చెయ్యమంటారు?"

'బట్టలకు మనకింకా పరిమిట్స్' రాలేదోయ్. కాబట్టి మెడ్రాసువెళ్ళి ఆపరిమిట్సు తీసుకురావాలి. మనకేదో నాలుగుడబ్బులు లాభించే చోట సంసారికవిషయాలు చూస్తూ కూర్చుంటేఎలా?"

"అలాగేనండి."

"మరి త్వరగాలే. ఈమధ్యాహ్నం బండికే బయలుదేరుతే రాత్రి 'మేల్" అందుకోవచ్చు.'

"ఇప్పుడే !!'

"ఒక్కటిచెబుతా విను. ఈనాటికి ఇన్నిలక్షలూ గడించానంటే—అదంతా మీనలనవల్లేకదూ! చూడు, ఈడబ్బాంతా ఎవరిది? మీదికదూ? ఇదంతా మీకు కాక మరెవరికి కర్చుపెడతాచెప్పు బిడ్డా? పాపా?...చస్తే కట్టుకుపోతానా? ఎవరైనా కట్టుకుపోయారా? ఏమిటోయ్! సుబ్బన్న! మాటాడవేం...ఇదంతా మీదికాదని ఏగాడి దగ్గొడుకన్నాడూ? ఒక్కటిచెబుతావిన—డబ్బుని మనం గడిస్తామా? మనల్ని డబ్బుగడిస్తుందా?"

"మనమే డబ్బుని గడిస్తామండి'

'మరింకే'

'అంచేత—'

'మీడబ్బు మీకే కర్చుపెట్టేస్తా. కష్టాలలో ఆదుకోబోయాక

ఇంకెందుకోయ్ వెధవబ్రతుకు! నీకష్టసుఖాలు నాకష్టసుఖాలు కావా? నీఇల్లు నాఇల్లుకాదా? నీతల్లి నాతల్లికాదా?"

"చిత్తం. చిత్తం."

'మరి నీవు ప్రయాణంలో ఉండు."

"వెళ్ళడానికి అభ్యంతరంలేదు. కాని...'

"ఆఁ ఏం?'

'మా అమ్మకు ప్రాణంమీదకొచ్చిందని డాక్టరన్నాడండీ.'

'వాడిముఖం. వాడికేం తెలుసు. ఇటువంటి నాటువైద్యుల వల్లే ఎంతోమంది అన్యాయంగా చంపబడుతున్నారు. నేను సర్జనుని పెడతాగా—పోనీవోయ్ ఒకసంచి రూపాయిలు పోతే పోనీయ్, నీ తల్లికంటే ఎక్కువేమిటి?'

సుబ్బన్న కళ్ళల్లో ఆనందం చిందులు తొక్కింది అతని తల్లి బ్రతికిపోయిందనుకున్నాడు. తల్లికి పూర్ణారోగ్యం వచ్చినట్లే భావించాడు. అంతకుముందు తల్లి అవసానదశలో లేకపోతానేమో అని భయపడినవాడు—తల్లిప్రాణాలను నిలబెట్టడానికైనా మదరాసు మహానగరానికి ప్రయాణం కట్టాలనుకున్నాడు.

"బాబయ్యా!"

'బయలుదేరినట్టేనా?'

'చిత్తం."

'భోంచేసి ఇలావచ్చేయ్. కావలసినకాగితాలూ డబ్బూ తీసుకెళుదువుగాని.'

'అలాగే'

'ఇంటిదగ్గర నీభార్యాబిడ్డలేమైనాపిరికితనంతో వద్దంటారేమో!

'నేవస్తాగా"

'మీఅమ్మ వద్దంటుందేమో!'

"సర్దిగా వస్తాదని ఆమెకు చెబుతాగా. అయినా నేను వెళ్లేది ఆమెకోసమేగా,'

"బాగాచెప్పావ్! తల్లిరుణం తీర్చుకోలేం'

'చిత్రం."

భద్రం భద్రంగా మేడమీదకు వెళ్లిపోయాడు. సుబ్బన్న. ఇటు అధికారిని సంతృప్తిపరుస్తూ, అటు మాతృప్రాణాలను నిలబెట్టు కోగలుగుతున్నానుకదా అనే ఆనందంతో మెడ్రాసుప్రయాణం కట్టాడు···ఎంతమంది వద్దన్నా వినకుండా మెడ్రాసు వెళ్ళాడు.



## vi

గురుభక్తి, సేవాధర్మంతప్ప సుబ్బన్నకు మరొకటిలేదు. పురాణశ్రవణం అతనికి ప్రాణం గుడికివెళ్ళి గర్భగుడి చుట్టూ ప్రదిక్షణ చేసి, గుళ్లో దేవుని పాదాలపై తన తలమోపి నమస్కరించందే నిదర పోదు— రాత్రిభోజనం చెయ్యగానే బజారుబయలు దేరతాడు— అక్కడనుంచీ ఎక్కడ హరికథ ఉందో- ఎక్కడ భాగవతం ఉందో ఎక్కడ పురాణం చెబుతున్నారో గాలించి వేస్తాడు. అక్కడ రాత్రి పన్నెండూ ఒంటిగంటవరకూ గడిపి ఇల్లుచేరతాడు. అతనికి వాదం అంటే ఇష్టం.

ఏకాదశి, దసరా, సంక్రాంతి, దీపావళి, వినాయకచవితి మొదలగు పండగలకు స్వామిని బంగారపు నగలతో పూర్తిగా అలంకారం చెయ్యకపోతే పూజార్లు ప్రాణాలు తీశాడే ప్రతిఊరేగింపుకు పది మంది గుమస్తాలను వెంటేసుకుని ముందు తయారు.

ఏస్వాములవారైనా శాస్త్రులవారైనా ఆఊరు వచ్చారా ఆయన వచ్చేవరకూ ఆయననువిడువడు—

అంతా మూఢవిశ్వాసం; పూర్వపంథా.

♦ ♦ ♦ ♦

ఒకచోట లంచాలిచ్చి; మరొకచోట బ్రతిమలాడి, వేరొక చోట అధికార్లతో తిట్లుతిని- నానా అవస్థలుపడి, తిండితిప్పలు లేకుండా ఆఫీసు చుట్టూ తిరిగి ఏలాగైతేనేం పరిమిట్లు సంపాదించి బయలు దేరాడు పాలకొల్లు- మదరాసు నగరం నుంచి—

సుబ్బన్నకు ఆరుగురుపిల్లలు. భార్య. తల్లి, ఇద్దరు తమ్ములు విధవఅత్తగారు. అవ్వ. వేలిడిసిన మేనల్లుడు. మొత్తం ఆతనితో అతనికుటుంబం పధ్నాలుగురు. జీతం నలభైఅయిదు. ఇద్దరు తమ్ములూ కుఱ్ఱకుంకలు— ఆ 'నెలజీతం''తో ఈసంసారం అంతా ఈదాలి ఎలా?

అప్పుడప్పుడు వాళ్లఅమ్మగార్ని— అంటే భద్రం షావుకారు భార్యాగార్ని— అడిగి కాసింత పాతఊరగాయ్ పట్టుకుపోతాడు. నల్లన్నంలోకి ఊరగాయ్ చాలాపనిచేసేది. పాపం! అలా అలా— ఎలాగో చమటూడ్చి కష్టించి సంసార రథాన్ని నడిపిస్తున్నాడు.

♦ ♦ ♦ ♦

మెడ్రాసు సెంట్రల్ స్టేషన్ విడిచింది ట్రెయిను. ట్రెయినులో కదిలిపోయే మేడమిద్దెల్ని— పర్వతాలనూ చూస్తున్నాడు. అతని

మనసుకూడా బొంగరంలా తిరిగిపోతూఉంది, కళ్ళుచెదిరిపోతూ ఉన్నాయ్. పిలిగాలిపు తీగలమీద కూర్చున్న పక్షుల్లాగ తనభావాలు కదిలిపోతూన్నాయ్.

పాపం! వాళ్ళమ్మ జ్ఞాపకంవచ్చింది. కళ్లమ్మట నీళ్ళు తిరిగాయ్ అనుకోకుండానే అతనిహృదయం గాలికి రెపరెపకొట్టుకుపోయింది.

"ఎందుకో ఈపిరికిమనసు ఇలాసుడిగుండాల్లో సున్నాలు చుడుతూంది. సర్జన్ గారు ఈసరికి మాఅమ్మరోగం పూర్తిగా కుదిర్చి ఉంటారు. మహాత్ములు. వారిమందులలోనే మహత్తరశక్తిఉంది. వారి చల్లనిహస్తంపడితేచాలు. సర్వవ్యాధి నివారణే... పైగా భగవంతుడు లేడూ? ఇంతకూ నాభాగ్యరేఖ బయటపడింది. కాబట్టి మాషావుకారుకు మంచిబుద్ధి పుట్టింది. లేకపోతే పిల్లికిబిచ్చంపెట్టనివాడు, గుమస్తాతల్లి చచ్చిందంటే తలకోరికి పదిరూపాయలు అప్పుగాఇవ్వనివాడు, నాకు సాయంచేస్తానన్నాడంటే నాభాగ్యం ఏమనిచెప్పను?

నేను ఇంటికివెళ్ళేసరికి మాఆడపిల్లలంతా "నాన్నా! నాన్నా ధవనంతెచ్చావా? తెచ్చావా" అంటూ నాచుట్టూ చేరతారు. అతిగర్వంతో "ఇదిగో" అని పావలాపెట్టికొన్న ఈధవనం కట్ట వారి ముందుపడేస్తా. వాళ్ళు చంకలు కొట్టుకొంటూ, గంతులువేస్తూ తలో కాస్తా పెట్టుకుంటారు. మాఆవిడకూడాముసిముసినవ్వులునవ్వుకుంటూ కాసింత తానుపెట్టుకొని— కాసింత చుట్టుపక్కలున్నావాళ్ళకిస్తుంది. ఇల్లంతా పండుగచేసుకున్నట్లుందికదా!

మాఅమ్మ 'అబ్బాయ్! మాషావుకారు దయవల్ల నాప్రాణాలు చల్లబడ్డయ్. చచ్చిపుట్టాననుకో, ఇంతకూ పేదలపాలిట దేవుడు లేడూ' అంటూ సావంక చూస్తూంటే మాఇల్లేవైకుంఠంకిౘంద ఉంటుందికదా!" అనుకుంటూ పరిగూా చేస్తూన్నాడు సుబ్బన్న.

తీయనిభావాలలో తేలిపోతూఉన్నాడు. గాలిలో మేడలు కడుతూఉన్నాడు. కాని గాలిమేడలకు పునాది ఉండదనీ, పునాదిలేని నేలంటా కూలిపోతాయనీ తెలీదుపాపం.

♦ ♦ ♦ ♦

ఇల్లుజేరాడు.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

గదితలుపు తోశాడు.

తల్లిమంచంలేదు.

తల్లిమంచందగ్గిర మాత్రం అలికి, ముగ్గులు పెట్టారు. దానిపై ఒక దీపస్తంభం దీపం వెలుగుతూ ఉంది.

ఆతనికేమీ బోధపడలేదు.

తలుపు తోసుకొని సావిట్లోకి వెళ్ళాడు. భార్యాబిడ్డలు గొల్లుమన్నారు.

పాపం! సుబ్బన్న ఒక్కనిమిషం అలాగే శవంలా బిగుసుకుపోయాడు.

తరువాత స్పృహవచ్చింది. దానితో 'అమ్మ! అమ్మా!" అంటూ నేలమీదపడి తలబాదుకుంటూ చంటిపిల్లవానిలా వెక్కివెక్కి ఏడ్వడం ప్రారంభించాడు.

తానొకటితలిస్తే దైవం ఒకటి తలచాడు! ఎంత ఘోరం!

♦ ♦ ♦ ♦

కొంతసేపయింది.

భార్యాలక్ష్మిని దగ్గిరకు పిలిచాడు.

"లక్ష్మీ! ఎంతపనిజరిగిందే.

'మనం అనుకున్నదేగా. వెళ్లొద్దని అత్తమ్మగారు ఎంతబ్రతిమలాడినా ఆగారా? మీపేరేపిలుస్తూ అబ్బాయ్, అబ్బాయ్' అని

కలవరిస్తూ ప్రాణాలువిడువలేక విడువలేకవిడిచారు. ఎంతబాధపడ్డారో అందరూ ఎన్నిమాటలన్నారో"

"నేనిలాగౌతుందని అనుకోలేదు."

"ఏం?"

'సర్జను రాలేదూ?'

"అయనెవరు?"

"పెద్దడాక్టర్ని మాసాహుకారు పంపలేదు?'

"ఆతనికేం కర్మం పంపడానికి?"

"ఆఁ"

"గొప్పవాళ్లకు హృదయాలెలా గుంటాయండీ!"

సుబ్బన్న ఆశ్చర్యపోయాడు.

అలాగే గోడకు జేరబడిపోయాడు.

"లక్ష్మి? అసలు అమ్మచనిపోయినట్లు ఆయనకు తెలుసా-"

"తెలియకేం? ఏభై కబుర్లు పంపాం."

"మందుమాకులకు ఇవ్వకపోతే మాని, శవదహనానికైనా డబ్బుపంపలేదా?"

"పంపితే ఇంకేం?"

మరెలా దహనం..."

అతడింకేమీ మాటలాడలేక పోయాడు. తల్లిచస్తే తగలబెట్టడానికైనా దమ్మిడీలేని తన దరిద్రస్థితి తన అవ్యక్తిని తలుచుకొనే వరికి—గుండెకరిగి కన్నీరై, ప్రవహించింది. హృదయం బద్దలైనట్లయింది. తలవంచుకున్నాడు.

భార్యజబాబు చెప్పలేక తలవంచుకొంది.

"లక్ష్మి! ఎలా—"

ఆమె మాట్లాడలేదు

ఆమెవంక బాధతో చూచాడు. మెళ్లో మంగళసూత్రంలేదు. అతనికి అర్థంఅయింది. ఇల్లాలి మంగళసూత్రంతో తల్లి దహనం అయిందని తెలిసింది. అతని దుస్థితికి కారణం షాహుకారని అర్థం అయింది. తల్లి తనచేతులమీదుగా వెళ్ళిపోయే భాగ్యానికి దూరం చేసింది షాహుకారని బోధపడింది.

లేచాడు.

తోకమీద నిలబడిన మహాసర్పంలా లేచి నిలబడ్డాడు.

అతనిలో తరతరాలుగా, యుగయుగాలగా దాగున్న క్రోధ యాగ్ని ఒక్కసారిగా ప్రజ్వలించింది. గుండెలోని బాధ ఒక్కసారిగా గొంతెత్తి కేక వేసింది.

ఎదురుగా ఉన్న గొడ్డలి తీసుకున్నాడు. ఆగొడ్డలితో షాహుకారు తలముక్కలు ముక్కలు చెయ్యాలనుకున్నాడు. బయలుదేరాడు భార్య అడ్డు నిలిచింది.

"ఎక్కడికి?"

'షాహుకారింటికి'

"ఎందుకు?"

'వాడితల ముక్కలు ముక్కలుచేసి' వాడి కళేబరాన్ని నెత్తుటిలో పొర్లించడానికి."

"లాభం?"

'అటువంటి దుర్మార్గులు చస్తేనేకాని లోకం బాగుపడదు.'

'ఎంతపొరపాటు.'

'ఏం?'

'దుర్మార్గులను చంప గలరుకాని, దుర్మార్గాన్నిలోకంతీసివేయలేరుగా. ఇతడ్ని చంపితే అతనితాత మరొకడు. అతడ్ని చంపితే లాభంలేదు. మీకు శక్తిఉంటే అతనిలో నాటుకుపోయిన దుర్మార్గాన్ని; స్వార్థాన్ని కూకటివేళ్ళతో పెకలించండి. అతని బుద్ధిచెడునుంచి

మంచికి మరల్చండి. అంతే కాని దుర్మార్గుని చంపితే దుర్మార్గము పోతుందా? రోగిని చంపితే రోగం పోతుందా? కావలసింది హృదయ పరివర్తనంగాని మానవహింసకాదు.

'లక్ష్మీ! ధనికులకు హృదయ పరివర్తనం కలుగదు. అది ప్రకృతి విరుద్ధం".

"పొరపాటు ధనికులూ మానవులే. వారిస్వార్థంవల్ల వారురాక్షసులౌతున్నారు. వారి దుర్మార్గం వల్ల వారు పిశాచులౌతున్నారు. ఎదటి మానవునకు మేము బలి అవడానికి మారు. తమస్వార్థానికి ఎదటిమానవుని బలిచేస్తున్నారు. వారిలోని స్వార్థం అనే కళ్ళుకడిగేయండి. వారూ మానవులౌతారు. వారు పెట్టుకున్న నల్లద్దాల కళ్ళజోడు తీయండి- సృష్టిని చక్కగాచూడగలరు"

"నీతు లాజాతికి లాభంలేదులక్ష్మీ! ధనికులకు హృదయాలుంటేగా పరివర్తనానికి."

'అలా అనకండి. రాజాధిరాజులే మారిపోయారు."

"ఎవరది?"

"బుద్ధుడు ధనికుడుకాడా? తనరాజ్యసర్వస్వాన్ని త్యాగంచేసి మహాత్ముడు కాలేదా? అతనికి హృదయపరివర్తన కలగలేదా?

అశోకుడు మహాచక్రవర్తి కాదా? తనసర్వస్వాన్ని త్యాగంచేసి కత్తివిడిచి ప్రేమతో రాజ్యాన్ని పాలించలేదా?

అంతవరకెందుకు? మనజవ్హార్ లాల్ కోటీశ్వరుడుకాదా? ఆయన సర్వస్వం ప్రజలకు ధారవోసి త్యాగమూర్తి కాలేదా? ఇలా వేనకువేలు."

"లక్ష్మీ!"

'నామాట వినండి. హింసాత్మకబుద్ధి విడువండి. మానవుడు మహాత్ముడయ్యేది పగసాధించికాదు; పగవిడచి.. ద్వేషించికాదు.

ప్రేమించి—ఎదటివారిని శిక్షించికాదు, క్షమించి—మనసునకు మహాత్మరశక్తి లభించేది క్షమవల్లకాదు. క్రోధంవల్లకాదు; మానవునకు దైవత్వంసిద్ధించేది అహింసవల్ల. హింసవల్లకాదు.

ఇలా ఆగొడ్డలి ఇవ్వండి—కసాయితనం మనకుకాదు. రాక్షసులకు"

"లక్ష్మీ! ఇలా దరిద్రంలో చావవలసిందేనా?"

'అవసరంలేదు. దానిదాస్యంపోతుంది. స్వాతంత్ర్యంవస్తుంది.'

"వస్తే?

'సర్వమానవసమత్వం, సర్వమానవసౌభ్రాతృత్వం నెలకొల్పబడతాయి- మనదేశం స్వర్గం అవుతుంది. మనం దేవతలం అవుతాం"

'స్వాతంత్ర్యం వస్తుందంటావా?'

"తప్పక."

"పేదలూ పెన్నిధులూ అనేభేదం పోతుందంటావా?"

"ముమ్మాటికి".

అతను వెర్రిగా నిలబడిపోయాడు- కన్నీళ్ళు నిండిపోయాయ్. కన్నీటిపొరలను తోడుకొనే అతనిచూపు భావిభారతభాగ్యోదయవికాసాన్నే చూస్తూంది.

ఆమె అతనిచేతిలో గొడ్డలి లాక్కుంది. గొడ్డలికిబదులు ఏడాది పాపాయిని అందించింది. పాపాయ్ తలపై అతనికన్నీళ్లు జారాయ్.

మళ్ళీకూర్చుండిపోయాడు.

"పరమాత్మా! మానవులే మానవులను విరుచుకు తింటున్నారు ఈరాక్షసత్వం ఎప్పుడు పోతుందోకదా!' అనుకుంటూ పాపాయిని చూస్తూ "దరిద్రులకేసంతానం' అని నిట్టూర్పు పుచ్చాడు. ఏమిటో పాపం! పేదబ్రతుకు!!

# V

"Povorty makes life so pitiable ! so utterly ludiorous.'

Ibsen—Narway

"దారిద్ర్యం జీవితాన్ని చాలా దౌర్భాగ్యస్థితిలోకి తీసుకు వెళుతుంది. చాలా అసహ్యకరంగా మార్చివేస్తుంది."

ఇబ్సన్—నార్వే.

◆ ◆ ◆ ◆

"The poor ought to revolt against the rich and those who oppressed them."

Pearl—Buck—America

"పేదలు భాగ్యవంతులపైనా, వారిని అణిచివేసేవారిపైనా తప్పక తిరగబడాలి. వారిదౌష్ట్యాన్ని ఎదుర్కోవాలి.'

పెరల్ బక్-అమెరికా.

† † †

"If all the houses of the rich were opened, it would not be enough for all the people. The poor filled the earth"

Pearl Buck—America

"భాగ్యవంతుల ఇళ్ళతలుపులన్నీ తెరిచి చోటిచ్చినా పేదలకు చాలదు. పేదలతో ఈప్రపంచం అంతా నిండిపోయింది."

పెరలుబక్ - అమెరికా.

† † †

దరిద్రం చవిచూడపోతే మానవుడు కాలేడంటాడు శ్రీ రామకృష్ణ పరమహంస. స్వరాజ్యం దరిద్రులను ధనికులను చేయడానికి

అంటాడు జవహర్లాలు నెహ్రూ! ఈప్రపంచంలో ఏమూలైనా ఒక దరిద్రుడున్నాడంటే నేను ఆనందంగా బ్రతకలేనంటాడు. గాంధీజీ ఏదేశంలో ఏమూలైనా ఒక కుక్కయినా ఆకలితో బాధ పడుతుందంటే నేను భరించలేనంటాడు. వివేకానంద పేదల కన్నీటిబిందువుల్లోనే భగవానుడాలయం కట్టుకుంటాడు, పేదవాళ్ల దగ్గరే భగవంతుడుంటాడంటాడు. మన రవీంద్రకవీంద్రుడు.

ఇలా దరిద్రించేసే విలయతాండవానికి కన్నీళ్ళు కార్చని సంహృదయుడుండడు- మనసాహుకారో!———పాపం! అతని స్వార్థ జీవితానికి జాలిచెందాలిగాని కోపించరాదు.

వారంరోజులు గడిచాయ్.

దాస్యంలో పెరిగిన ప్రాణి స్వాతంత్ర్య వాతావరణంలో ఎలా పెరుగలేడో- అలాగే గుమాస్తా జీవితానికి అలవాటు పడిన సుబ్బన్న గుమాస్తాపని తప్ప ఏపనీ చెయ్యలేడనుకున్నాడు.

చేసేపని ఏమీలేక, గతిలేక, తిండిగడవక, మళ్ళీ యజమాని భద్రం గుమ్మం తొక్కాడు గుమాస్తా సుబ్బన్న.

భద్రం తమలపాకులు వేసుకుంటూ చూచాడు సుబ్బన్నను

“ఏమోయ్? సుబ్బన్నా?”

‘ఏం బాబు’

‘పరిమిట్లు పంపావు; లెఖ్ఖ చెప్పలేదే”

“ఇంకా లెఖ్ఖ ఏమిటండీ ఇచ్చింది చాలక నానా అవస్థపడితే.

‘50 రూపాయి లేమిచేశావ్’

‘పాతికరూపాయిలు లంచం ఇచ్చా.’

‘అయితే రసీదేది?

‘లంచం తీసుకున్న వాడు లంచం తీసుకున్నానని ఎక్కడైనా రసీదిస్తాడా?

'మరి నీవు లంచం ఇచ్చినట్టిలా!'

"ఇవ్వకపోతే పరిమిట్లెలా వస్తాయ్."

'వాళ్లిస్తే,"

'డబ్బిస్తేనేగా వాళ్ళిచ్చింది."

'నమ్మడం ఎలా!

'దానికి నేనేం జవాబు చెబుతానండి."

'సుబ్బన్నా! ఆపిచ్చి పిచ్చి వేషాలేమీ మనదగ్గర పనిజరగవు. ఆపాతికరూపాయలూ నీ ఖాతాలో కర్చు రాయవలసిందే.

'ఖాతాలో కర్చు వ్రాస్తారా!'

'తప్పుతుందా!"

'అలాగే వ్రాయండి. కడుపుకట్టుకొని వాడికాళ్లూ వీడికాళ్లూ పట్టుకొని పరిమిట్లు సంపాదించినందుకు ఈశిక్ష.

దానికాక్కాదు; నీ తెలివితక్కువకు.

చిత్తం. తెలివితేటలే ఉంటే మేం సంపాదించి మిమ్మల్ని భాగ్యవంతుల నెందుకు చేస్తాం.

చాల్లే. అట్టే ఎక్కువగా మాట్లాడకు. మాటలు మాజోరీగా వస్తూ ఉన్నాయ్.

అలాగే. వచ్చినవే మాటలు. కార్యాలు కావు.

అయితే మిగిలిన పాతికరూపాయలూ ఏంచేశావ్.

భోజనానికి, రిక్షా, ట్రాంబళ్ళకూ కాలేదూ...

భోజనానికా,..ఇంకానయ్యం! ఏమైనా డబ్బు చెట్టున కాస్తుం దనుకున్నావా అలా తినేయడానికి.

భోంచెయ్యకుండా ఎలా పనిచెయ్యడం చెప్పండి.

"ఏ తయర్ సాదమో" కొనుక్కుని తినాలిగాని మహా భాగ్య వంతుల్లా హోటల్లో భోంచెయ్యగలమా!

కడుపు నిండొద్దండి.

కడుపు నిండాలి కళ్ళకు కావరం రావాలి.

సుబ్బన్నకు కోపం వచ్చింది.

ఎంత కావరం కాకపోతే కన్నతల్లిని మృత్యువు కప్పగించి మీసేవా వ్యామోహంలో కళ్ళుగానక కొట్టుకుపోతాను!.

"నీవు దగ్గరుంటే రక్షిస్తావు కాబోలు"

"ఏమో! ఎవరు చెప్పగలరు!'

"మందూ మాకూలూ లేకే మహారాజులు మరణిస్తున్నారా? పిచ్చివాడా! కాలం సమీపించేసరికి కాలరుద్రుడైనా 'కన్నుమూయ వలసిందే. పుట్టినవాళ్లు గిట్టకుండా ఉంటారా? గిట్టినవాళ్లు పుట్టకుండా ఉంటారా? జననమరణాలు మనచేతిలో ఉంటాయా?

'జనన మరణాలు మనచేతిలో లేవు. పుట్టినవాళ్లు చావకతప్పదు చచ్చినవాళ్ళు వట్టి చేతులతో పోక తప్పదు. అందుచేతే మీరిలా దానధర్మాలు చేసేస్తున్నారు. ఎందుకొచ్చిన మాటలండీ కబుర్లకూ కార్యాలకూ సంబంధం లేనపుడు డాక్టర్ని పెడతాను, డబ్బుఖర్చుచేసి మాఅమ్మ ప్రాణాలు రక్షిస్తానని మందుమాకులు పోయక మృతువుకు అప్పజెప్పిన ఘుహనీయులు, ఏంచెయ్యలేరు! బ్రతుకు దెరువుతున్నవా డెవడండీ మీదగ్గర పనిచేసేది!

హృదయంలేని మీవంటి షావుకార్లకు సూవజ్జీవితం మాశరీరాలను అమ్ముకొని జీవచ్ఛవాళ్లా బ్రతికేదానికంటే- ఒక్కక్షణం ఆకసాయివాని కత్తిమొనకు అమ్ముడైపోతే భాగుంటుంది. ఈపాపాలన్నీ నాటితోనైనా శమిస్తాయ్.

'పాపాలేమిటోయ్''

"మీగురించి ఎన్ని అబద్ధాలాడుతున్నాన్; ఎన్ని అక్రిమాలు చేస్తున్నామ్' నరకాగ్ని మధ్యంలో మేం మాలమలా మాడిపోతూ,

మీకు సర్వసౌధాన్ని నిర్మిస్తున్నాం. మేం పస్తుండి మీకు పరమాన్నం పెడుతూన్నాం. మా శవదహనానంతరం మిగిలిన బూడిదలోనే మీ భాగ్యం'

'సుబ్బన్నా! ఏమిటోయ్! ఆలుసిచ్చిన కొద్దీ నెత్తెక్కి పిండికొడుతున్నావే. జాగ్రత. నీ ఇష్టం ఉంటే పని చెయ్; లేకపోతే మానేయ్. నీతాత మరొకడు. ప్రజలు పనిపాటలు లేక చస్తుంటే నీకు పనిచ్చి కూడు పెడుతున్నందుకా ఈపొగరు! ఇకనుంచీ నేను చెప్పినట్లు చేయగలిగితే పనిచేయ్; లేకపోతే తక్షణం మానేయ్.

'చేయడానికి వచ్చాను కాని మానడానికి రాలేదండీ.

'అయినప్పుడెందుకీ వెధవవాగుడు?

'వెధవను కాబట్టి

అలాగే ఉంది. అయితే రేపు ఆదివారం సెలవు కదూ?

తమరిదయవల్ల.

నాదయుంటే సెలవిచ్చి మిమ్మల్నిలా సోమారులగా చేసానా!

సోమారులను చేయడం ఏముందండీ- ఆరోజైనా హాయిగా విశ్రాంతి తీసుకుంటారు గుమాస్తాలు. వారానికి ఒకరోజేగా—

వారానికి ఒకరోజంటే నెలకు నాలుగురోజులు. సంవత్సరానికి 48 రోజులు దసరా, సంక్రాంతి, దీపావళి మొదలైన పండుగలు కలుపుతే సంవత్సరానికి రెండు నెలలు— ఈ లెఖ్కని షాహుకారు నోట్లో దుమ్ము కొట్టుకు పోవలసిందే—

ఈమాత్రానికే—

కాకపోతే ఈ వెర్రిమొర్రి సెలవలేమిటోయ్. గానురాను ఈ కమ్యూనిస్టులవల్ల దేశం అంతా నాశనం అయ్యేటట్టుంది. వాళ్లు తెచ్చిందే అనుకుంటూ ఈ సెలవలగొడవ—వాగివల్లే ప్రతివాకీ వెధవా ఒక మహాయోధుడై పోతున్నాడు. ప్రతి స్త్రీ ఒక ఇస్త్రీపెట్టె మమ్మల్ని

తో మేస్తూంరి. వీళ్ళంతా కలిసి కేవలం మమ్మల్ని చాకిరేవు పెట్టేస్తున్నారు. అంతా ఒకట్టైపోవాలంట పేదసాదలుండరాదంట. స్త్రీపురుషభేదం పాటించ రాదంట. అన్ని కులాలూ కలిసిపోవాలంట. మతాలన్నీ ఒకట్టైపోవాలంట—ఏమిటో వెధవ ప్రబోధాలు. తల క్రింద పెట్టి నడవమంటారు. వాళ్ళకేం. నమ్మేవారుండాలి"

"వారు చెప్పినట్లు ముందుముందు దేశం మారకూడదండీ—'

"ఆనాడు మనం వెనక్కి నడుస్తాం; వెనక్కి చూస్తాం... మా మారఘు, మాంధాత, దశరధ. శ్రీరామచంద్రమూర్తి మహారాజుల పాలనలో లేని ఈసమానత్వం వస్తుందా? సరే- వాళ్లలా అఘోరిస్తే మనకేంగాని రేపు ఆదివారం కదూ!'

'అవునండి.'

"అయితే రేపు మంచిమంచి ఉప్పాడంచుకోకలూ, వాయిల్సు జరీపేటంచు కండువాలూ, సిల్కు జంపర్లు మూటకట్టించుకొని ఏపల్లెటూరైనా వెళ్ళు. చాలా మనకు లాభిస్తుంది'

"రేపు సెలవరోజండి"

"అది సోమూరులకోయ్; మనకాదు.

"ఆరోజు మాచేత పనిచేయిస్తే ప్రభుత్వం మిమ్మల్ని శిక్షిస్తుందండి."

"అలాగా...అయితే ఎప్పుడో ఖయిదులో ఉండవలసినవాళ్లమేగా, లక్షరూపాయిలు బ్లేక్ మార్కెట్టులో సంపాదించినప్పుడేశిక్ష పడిందని ఇప్పుడాదివారం సెలవరోజులోకూడా పనిచేస్తే శిక్ష పడుతుంది? గవర్నమెంటుసంగతి మనకు తెలీందేముంది? దానికి భయపడేది పేదలుకాని పెన్నిధులు కాదోయ్ సుబ్బన్నా!"

"నిజం సుమండీ! ఏకరువు కాటకాలు వచ్చినా బాధపడి చచ్చేది పేదలేకాని పెన్నిధులుకారు. ఏతప్పుచేసినా క్రిమశిక్ష అను

భవించేది కూలివాళ్ళేగాని గొప్పవాళ్ళుకారు. ఏవిప్లవం అయినా నడచి వెళ్ళేది కూలీల గుండెలమీదే..."

సుబ్బన్న గొంతుకెవరో బిగపెట్టి నట్లయింది. ఇంకేమీ మాట్లాడలేకపోయాడు. దారిద్ర్యం మానవహృదయాలను ఎంతగా దహించి వేస్తుందో తెలుసుకొనే సరికి గుండె బద్దలైపోయింది.

ఎంత కష్టించా పొట్టగడవని దౌర్భాగ్యానికి బానిస భారత దేశం తెలుసుకొని లోలోన కుమిలిపోయాడు.

'రేపు వెళతావ్ కదూ?"

"తప్పుతుందా!"

"ఏమిటోయ్! ఆసీళ్లు నమలడం! ఏదో మాకు సహా ఊరకే చేస్తున్నట్లు ఇలా మీరు ఉసూరుమంటూ పని చెయ్యబట్టే వచ్చేలాభాలన్నీ పోతున్నాయ్... ఎందుకో వెధవ మాడుముఖం...'

భద్రం సుబ్బన్నను తిడుతూ మేడమీదకు వెళ్ళిపోయాడు. తిట్లన్నీ జీర్ణంచేసుకొని పద్దులు వ్రాసుకుంటూ ప్రారంభించాడు గుమాస్తా సుబ్బన్న, ఏమిటో కాలమహిమ!



## vi

"No solution was found for the problem of equality. India deliberate ignored this and built up her social structure on inequality and it have the tragic consequences of this policy in the millions of our people who till yesterday were suppressed and had little opportunity for growth."

JAWAHARLAL NEHRU—1930

"సర్వమానవ సమత్వానికి ఎట్టిమార్గం కనబడలేదు. ఇండియా ఈసమత్వ మార్గాన్ని పూర్తిగా నిర్లక్ష్యంచేసి, తనసాంఘిక జీవనవిధాన్ని అసమానత్వంమీద నిర్మించుకొంది. దాని దుష్ఫలితంగానే నిన్నటివరకూ లక్షలాదిగా మన ప్రజలు పీడింపబడుతున్నారు. అభ్యుదయానికి ఎట్టివీలూ లేకుండా బాధా పరిదగ్ధబానిస జీవచ్ఛవాలయ్యారు."

జవహరు లాలు నెహూ్రు—1930.

◆ ◆ ◆ ◆

సర్వమానవ సమత్వం, స్వాతంత్ర్యం, అభ్యుదయం కోల్పోయిన మనజాతి. పతితమై, పరిదగ్ధమై, కలుషితమై, కంటకాకృతమై పోయింది బానిసత్వానికి అలవాటుపడిన భారతజాతి స్వాతంత్ర్యాన్ని కాంక్షించలేకపోతూంది.

జాతిమత కలహాలవల్ల, కులభేదాలవల్ల, ధనికుల దౌర్జన్యం "వల్ల, స్త్రీల నగౌరవించకంవల్ల మన భారతదేశం ఎంతఅభ్యుదయాన్ని కోలుపోయిందో చెప్పలేం.

ఆంగ్లజాతి హైందవజాతి ధర్మాలనాక్షేపణచేసింది. హైందవ జాతి ఆంగ్లేయుల ఆచారాల నధిక్షేపించింది. దానితో కలహాలు——

బౌద్ధ జైనమహమ్మదు క్రైస్తవ మతాలు హిందూమత సాంప్రదాయాలను ఎదుర్కొన్నాయ్. హిందూమతంపై మతాలను కూకటి వేళ్ళతో పెగలించాలని చూచింది. దానితో యుద్ధాలు; రక్తప్రవాహాలు...

వేదాధ్యయనం, విజ్ఞానసముపార్జనం మాసొమ్మని బ్రాహ్మణులు బ్రాహ్మణేతరుల అజ్ఞానులచేశారు వేదం చదివినవారినాలుకలు కోశారు. విన్నవారి చెవ్వులలో సీసం కరగించి పోశారు. ఇలాఎన్నో

అమానుషకృత్యాలు చేశారు. దానితో బ్రాహ్మణేతరులకు సేవించడంతప్ప మరొక స్వతంత్రభావం కలుగలేదు. అలా జాతి నిర్వీర్యం అయిపోయింది.

ఇక ధనికులు దరిద్రుల నెత్తురు పిండి వారంపోశారు వారి ఖజానాలముందు వారి దౌర్జన్యం వల్ల ఎందరో పేదలు తమకున్న భావాలకు ప్రోత్సాహం లేక నశించి పోయారు.

అన్నిటికంటే ముఖ్యంగా స్త్రీని చాలా అగౌరవపరచారు మనవారు. వేదకాలంనాడు స్త్రీకున్న గౌరవం; పూజ, అభిమానం, విజ్ఞానం పౌరాణకాలం నాడు లేదు. రానురాను స్త్రీని ఒక ఆటబొమ్మ కింద తయారు చేసింది స్వార్థసంఘం. కేవలం మగవాని కాముకతృష్ణ చల్లార్చుకుంటానికి ఉపయుక్తమైన యంత్రంకింద తయారుచేసింది. దానితో భారతజాతి విజ్ఞాన శిఖరంనుండి పడిపోయింది పాతాళలోకంలో ఏజాతి స్త్రీజాతిని పూజించలేదో ఆజాతి కోతిజాతికంటే హీనం.

ఇలా మన దేశం జాతిమత కులభేదంవల్ల— మనస్త్రీలకు తగిన విజ్ఞానాన్ని ప్రసాదించక పోవడంచేత...ధనికులు తమ ధనాన్ని సక్రమంగా వినియోగించుకోలేక పోవడంచేత— నాశనం అయిపోయింది. మనలో విజ్ఞానం ఉంటే, అంతర్జాతీయ విషయాలు అర్థం అయితే, ప్రపంచ పరిణామం గ్రాహ్యం అయితే, మానవమనః ప్రవృత్తి అవగాహన అయితే, స్వతంత్రేచ్ఛ ఉషస్మాత్రం అలవడితే, అభ్యుదయానికే మన హృదయాలు ముందడుగు వేస్తే మనకీ బానిసత్వము ఎందుకుంటుంది? మనల నీపాశ్చాత్యులు ఎలా పాలిస్తారు!

ఒక్కమాట చెబుతావినండి—

విజ్ఞాని అయిన బ్రాహ్మణుడు అజ్ఞానులైన బ్రాహ్మణేతరులకు విజ్ఞాన ప్రబోధం చేయరాదూ!

ప్రతిమగవాడూ తన కన్నతల్లిని, చేసుకున్న భార్యను, తాను కన్నకూతుండ్రను ప్రేమించడం నేర్చుకో రాదూ!

ప్రతిధనికుడు తనను గొప్పవాణ్ని చేసిన దరిద్రులను ప్రేమిస్తూ వారికి తనఆస్తిలో కొంత త్యాగము చేయరాదూ!

చేస్తే ఈకరువూ కాటకాలుంటాయా? ఈపేదలప్రాణాలిలా ఆకలి దయ్యానికి ఆహుతి అవుతాయా?

† • † †

సుబ్బన్న శరీరం రోజురోజుకూ ఎముకలగూడులా తయారై పోతూంది. కట్టుకుంటానికి బట్టలేదు. తినడానికి తిండిలేదు. పూర్వం మూడు పూటలా తినేవాడు ఇప్పుడు "నెలజీతం" చాలక రెండు పూటలే తినవస్తున్నాడూ అదైనాకడుపునిండాకాదు. అర్థాకలితీరుతూంది...పిల్లలగతి మరీదుర్భరంగాఉంది. ఇలాసంసారం ఉంటే దీనికి తోడు చుట్టాలు; స్నేహితులు, ఎలా?

అక్కడితో అయిందా? సంవత్సరం తిరగకముందేభార్యాగర్భవతికావడం; పిల్లల్ని కనడం; సుబ్బన్న "చచ్చానురాదేవుడా" అని గొల్లుమని ఏడ్వడం.

మధ్యమధ్యభార్యాబిడ్డలకు జబ్బులు జబ్బుతగ్గడానికి మందులు-మాకులకు డబ్బు—ఎక్కడిది? దానితో బెంగ; మంచంపట్టడం, ఆసం

దం అనుభవించవలసిన జీవితాలు దారిద్ర్యంతో ఎలాకృంగికృశించి పోతూ ఉన్నాయో చూడండి.



సుబ్బన్న కారోజుమధ్యాహ్నంకూడా భోజనంలేదు. అతగాడి వాటాఎవరో చుట్టం తినీపోయాడు. అందుచేత వస్తు. కరువులో అధిక మాసం.

ఆమిట్టమధ్యాహ్నం శరీరంలో ఓపికలేకపోయినా కాళ్లీడ్చుకుంటూ షావుకారుగారి ఆఫీసుకి చేరబోతూఉన్నాడు. త్రోవలో తనమిత్రుడు రత్తయ్య కనిపించాడు···సుబ్బన్న ఆకారంచూచి నివ్వెరపోయాడు.

"సుబ్బన్నా! ఏరా ఇలాగున్నావు!"

"అబ్బే! ఏమీలేదురా!"

"నిజంచెప్పు—భోంచేశావా!"

సుబ్బన్న సిగ్గుతో తలవంచుకున్నాడు- అబద్ధ మాడలేడు, నిజంచెప్పలేడు...

"సుబ్బన్నా! నీవు ఏమైనాతప్పుచేస్తే సిగ్గుపడాలి. తిండిలేక పోతే సిగ్గుపడడంఎందుకు!"

"మగవాడ్నయియుండీ తిండికైనా సంపాదించుకోలేపోతున్నా కాబట్టి"

"దానికి నీవేం చేస్తావ్? కష్టపడుతున్నావ్. పొట్ట గడవడం లేదు.'

'ఆ వ్నవును'

'ఇలారా...'

ఇద్దరూ కాఫీహోటలుకు వెళ్ళారు. సుబ్బన్న దోసె తింటూ ఉన్నాడు, ఎందుకో భార్యాబిడ్డలను తలచుకొనేసరికి అతనికి కంటి నీళ్ళు నిండిపోయాయ్. తినలేకపోయాడు. వెంటనే లేచిపోయాడు—

'ఏరా సుబ్బన్నా! తినలేదేం!'

"ఇంట్లో నా భార్యా పస్తుంటే నేనెలా తినగలనురా."

వాళ్ళకూ తీసుకు వెళుదువుగాని..."

"అయితే ఆపొట్లాం ఇంటికే పట్టుకుపోతా-"

'సరే'

రత్తయ్య దోసిలూ అవీ పొట్లాం కట్టించాడు, సుబ్బన్న ఆనందంతో ఇంటికి వెళ్ళాడు. పేదవాళ్ళకు పేదవాళ్ళే దిక్కు.

† † †

రత్తయ్య మొట్టమొదట్లో సుబ్బన్నలాగే గుమస్తా. కాని స్వతంత్రాభిలాషి, మరొక షాహుకారుచే కొట్టు పెట్టించి అతనితో 'పేడ వాటా' కు చేరాడు. నమ్మినబంటు. కష్టించి పనిచేస్తాడు- దానితో ఆసంవత్సరం 80 వేల రూపాయల లాభంవచ్చింది. తనవాటాకు పది వేలరూపాయిలు వచ్చాయ్.

ఆరాత్రి సుబ్బన్నను పిలుచుకొన్నాడు

'సుబ్బన్నా! ఒక పనిచెప్తా చేస్తావా?"

"తప్పక"

"ప్రమాణం చెయ్యి'

అతడు ప్రమాణం చేశాడు.

'అయితే రేపటినుంచీ నీపనిమానెయ్ "

"మానేస్తే బ్రతుకు తెరువెలా?'

"నేనుచూపిస్తా"

'అయితేసరే."

'లచ్చన్నచెట్టి లక్షాధికారి. బిజినెస్ ఎలా చెయ్యాలో తెలీదు. అతగాడితో నీవు 'వర్కింగ్ పార్టనర్"గా జేరితే 'బేడ వాటా' ఇస్తాడు.

'నిజం.'

"నిజంగానే.

'అంతకంటేనా, నాపని రేపే మానేస్తా. కాని షావుకారికి వెయ్యిరూపాయిల అప్పుందే.'

'నేనిస్తాలే."

"బ్రతికిచ్చావ్ రత్తయ్యా! మాకుటుంబాన్ని నిలబెట్టిన వాడవయ్యావ్...నీరుణం ఏలా తీర్చుకుంటమో!"

"రుణం ఏముందోయ్! గుమస్తాలంతా కలిసి ఒకసంఘంగా ఏర్పాటు చేసుకుని, ఒకేమాట మీదుంటే ఈషావుకార్లేం చెయ్యగలరు?

"తలుపు వేసుకొని ఇంట్లో బెంగపెట్టుకొని మంచం పట్టగలరు.

"సుబ్బన్నా! ఒక్కమాట చెబుతావిను. ఈషావుకార్లంతా

మొట్టమొదట మనవంటి గుమాస్తాలే. వాళ్ళను లక్షాధికారులను చేస్తుంది మనం. మనల్ని భిక్షాధికారుల్ని చేస్తుంది వారు మనకష్టాల ఫలితంగా వారు మేడలు కడుతున్నారు. వారు మనల్ని పెట్టే కష్టాల ఫలితంగా మనం కొంపలు లేకుండాపోతున్నాం."

'నిజం. నిజం. మనకింక మోక్షంలేదనుకుంటా."

"లేకేం. అందరం ఒకటైతే సరి."

"అయితే."

"మొట్టమొదట జీతాలు హెచ్చించకపోతే పని చెయ్యనందాం—

"తరువాత."

'వాటాలు పంచకపోతే పని చెయ్యనందాం."

"సాగుతుందంటావా?'

'తప్పక. వాళ్ళకేం బాధ? రూపాయి లాభంవస్తే బేడ- యివ్వలేరూ—"

'కొంపతీసి మరొక ఊరునుంచి గుమస్తాలను తెచ్చుకుంటే..."

"అక్కడెల్లా? ఇలా ఎంతకాలం చెయ్యగలరు? వారికిమాత్రం అకటి బాధలేదూ? వారు మాత్రం మనుష్యులు కారూ?

"బాగా చెప్పావ్?

"ప్రతి ఊరులోనూ గుమాస్తాలసంఘం నెలకొల్పుదాం. అన్ని సంఘాలకూ ఒక సెంట్రల్ ఎసోసియేషన్" ఏర్పర్చుకుందాం. ఆపెద్ద సంస్థ ఎలా చెబితే అలానడచుకుందాం."

'బాగు బాగు.'

'దానితో వారిబాగుకూ అణుగుతుంది; మన తిండీ గడుస్తుంది?'

"అవును. వారిని మనం ద్వేషించడం లేదుగా. ప్రేమిస్తూనే

ఉన్నాం. కన్నతండ్రిల్లా చూస్తూనే ఉన్నాం. కాకపోతే మాకడుపునిండా తిండిపెట్టమంటున్నాం. వారుని పేదవాళ్లు కావాలనడం లేదు. మనల్ని గొప్పవాళ్ళని చెయ్యమంటున్నాం. వారిమేడలు గుడిసెలు కారాదు. మనగుడిసెలు మేడలుకావాలి.

'అవునవును.''

'అలాగైతే గుమస్తాల సంఘం లేవదీద్దాం.'

"సరే."

ఇద్దరూ అలా నిశ్చయానికి వచ్చారు ముందు వారెలాగుంటారో చూద్దాం.

† † † † †

—·—

# vii

'సంఘబలం కంటే గొప్పబలంలేదు.

"Unity is devine"

సాంఘీ భావమే భగవచ్ఛక్తి.

ఒక గడ్డిపరకను త్రెంచడం సులభం. కొన్ని వేల గడ్డిపరకలను కలిసి జతచేసి తాడుగా అల్లితే మహాకాయమ్ములు తిరిగిన వాడుకూడా త్రెంచలేడు. దానితో బంధిస్తే ఏనుగుకూడా బంధీకావలసిందే. దాని బంధం తెంచుకు పోలేదు.

అందుచే స్వార్థపరులమై ఒకళ్లొకళ్ళం వేరైపోతామూ, శత్రు మృగరాజుకు బలిఅయిపోతాం. అంతాకలిసిఏమహాత్ముని మాటమీదో ఉంటామూ శత్రుమృగరాజు మన పొలిమేర అంచులపైకూడా పాదం మోపలేడు. మనలను కన్నెత్తిచూడలేడు.

ఒకేమతం; ఒకేజాతి; ఒకేకులం— ఏదేశానికైనా వాంఛనీయమే. అలా ఒకేమతం సిద్ధించక పెక్కుమతాలు మానవ భిన్న ప్రవృత్తుల కనుగుణ్యంగా ఏర్పడినా, భిన్నజాతులూ కులాలూ సంభవించినా భయపడ నవసరంలేదు. ఎప్పుడు? మనవ్యక్తిగత భావాలు విడిచి మహాసంస్థ ఆదేశాను సారం నడిచినప్పుడు.

ఎలాగంటే ఇండియాకంతకు మహాసంస్థ కాంగ్రెసు. దానిని ఆదేశించేది మహాత్ముడు. ఆయన ఆదేశాలకు భిన్నాదేశాలు కలవాడు జవ్హార్‌లాల్ నెహ్రూ.

గాంధీజీ దృష్టి జాతీయతమీద, నెహ్రూదృష్టి అంతర్జాతీయత మీద—స్వాతంత్ర్యం వస్తే అహింసా సిద్ధాంతాలమీదే అన్నాడు గాంధీజీ, స్వతంత్రం అహింసాసిద్ధాంతాలమీద కాకపోతే హింసాసిద్ధాంతం నేనవలంభించవలసి ఉంటుందన్నాడు నెహ్రూ—

ఇలాగే గాంధీజీ తిలకుల దృక్పథంలో కూడా భేదం లేకపోలేదు. నా దేశానికి స్వతంత్రం వచ్చే నిమిత్తం అవసరం వస్తే ఎన్ని అబద్ధాలైనా ఆడేస్తానన్నాడు తిలక్. నా ప్రాణం పోయినా, స్వతంత్రం రాకపోయినా నేను సత్యాన్ని తప్పను. సత్యం భగవంతుడు. నా మంత్రం సత్యం— అన్నాడు గాంధీజీ.

ఇలా మన నాయకుల దృక్పథాలలో ఎన్నో భేదాలున్నాయ్— అవి సహజం. ఎవరి మనః ప్రవృత్తిననుబట్టి వారి భావాలుంటాయ్. అందరి మనసులూ ఒకటి కానేరవు. అందరి భావాలూ ఒకటి కానేరవు, అయితే సృష్టిలో అందచందాలే లేవు.

అయినప్పటికీ మన మహాసంస్థ— మన మహానాయకులంతా కలసి సంస్థ ఏక కంఠాన్న ఏది తీర్మానిస్తే అదిమనం చేయవలసిందే, మన వ్యక్తిగతాభిప్రాయాలు బలిచేయవలసిందే—

అలా కానినాడు మనం 'ముందడుగు' వేయలేం— 'ముందు చూపు' చూడలేం కాలానికి 'ఎదురీత' కొట్టలేం— శత్రుహృదయనిర్భేదకంగా ఒక్కమాట అనలేం. ఈ పరమ సత్యాన్ని గ్రహించాడు కాబట్టే తన సామ్యవాదసిద్ధాంతాలకు సంస్థ అనుకూలంగా లేకపోయినా దానిని వెన్నంటే ఉన్నాడు. ఈ పరమసత్యాన్ని అర్థం చేసుకోనివాళ్ళంతా సంస్థనుండి బయటకు వచ్చివేశారు,

దానితో టెఱ్రిస్టులు, రాయిస్టులు, కమ్యూనిష్టులు, సోషలిష్టులు—అంటూ ఆగాంగ్రెస్ మహావృక్షాన్నుంచి చీలిపోయి, వేరై, దేశంలో బలం తగ్గించివేస్తున్నారు. వ్యక్తిగతాభిప్రాయాలను పాటిస్తున్నారు. వారు చీలిపోయారు; దేశాన్ని చీలదీస్తున్నారు—

దేశానికి కమ్యూనిజం వచ్చినా కాంగ్రెస్ వచ్చినా సంతోషమే కారణం ఆ రెండు పార్టీలూ వాంఛించేది— "స్వతంత్రం'— 'సర్వమాన

వసమత్వం"—మానవాభ్యుదయం" కాబట్టి పరపరిభుత్వం ఈనిరంతర దాస్యంపోయి ఏపార్టీ వచ్చినా ప్రజలకు మేలే.

కాని ఇలా ఒకళ్ళపై మరొకళ్లు కాలుదువ్వినంతకాలం స్వాతంత్ర్యం రాదేమోనని భయం వేస్తుంది... మహాసంస్థఅయిన కాంగ్రెస్ ఉడుకు నెత్తురు ఉప్పొంగే ఈచిన్న సంస్థఅయిన కమ్యూనిష్టు పార్టీని తనకడుపులో దాచుకుంటే మంచిదనుకుంటూ ..

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే పై పార్టీలలాగ మీగుమస్తాలంతా భిన్నాభిన్న కాకండి. వివిధ పార్టీలుగా వేరై పోకండి. వేరైతే మీఆశయం నెరవేరదు. మీగమ్యం మీరు చేరలేరు.

మీగుమస్తాలంతా ఒక్కటై మీమీ జీవితాలు మీకుటుంబ పోషణానికి అనుగుణంగా, హెచ్చించమనండి. కష్టించేది కడుపుగడవడానికే ఆర్జించేది అనుభవించడానికే ధనాన్ని వినియోగించడానికే గాని, భూస్థాపన చేయడానికిఎవ్వరికీ, ఏదేశంలోనూ, ఏకాలంలోనూ అర్హతలేదు.షావుకార్లుతప్పకుండా మీమీ జీతాలను హెచ్చిస్తారు.

తరువాత అనుభవజ్ఞులైన గుమస్తాలు షావుకార్లను ఒక అణా వాటా అడగండి. తప్పులేదు. అతనికి పదిహేనువంతులు మీకు ఒక వంతు...

ఇలా మీమీ కోర్కెలను తీర్చకపోతే మీమీ గుమాస్తాల పని మానివేయండి. తిండి గడవకుండా, మీమీబిడ్డలను మృత్యుదేవతకు అప్పగించే దానికంటే మీమీవృత్తులు మార్చుకుంటేమేలు.

లోకంలో బ్రతకడానికి ఎన్నోవృత్తులున్నాయ్. "అలవాటు" (habit) చేత మీగు గుమాస్తాలపనులు తప్పక ఇతర పనులుచేయలేరనుకుంటున్నారు, అది చాల పొరపాటు. నీరుండాలేకాని, అదివంగ మొక్కన్నూ పెంచుతుంది, కొబ్బరి మొక్కన్నూ పెంచుతుంది. ఈ

కష్టం మీరితరతరాలు వినియోగిస్తే మీభార్యాబిడ్డలు తిండిలేకుండా చావరు... దేశాని కెంతో తోడ్పడవలసిన మీరిలా బక్క చిక్కి ఎముకలగూళ్ళలాగున్నారంటే ఎంతో అన్యాయం, అక్రమం... ఈ అమానుష కృత్యంవల్ల వచ్చే పాపాలకు మీషావుకార్లు యదార్థముగా బాధ్యులు.

మీవల్లవారు లక్షాధికారు లౌతున్నారు. ఈసత్యాన్ని మీరు మరచిపోకండి. మిమ్మల్ని విడిచిపెడితే షావుకార్లకు మార్గం లేదు కాని షావుకార్లను విడిచిపెడితే మీకు మార్గం ఉంది. మీరువిడిచిపెడితే-వారు లక్షాధికారులు కాలేరు; వారిని మీరు విడిచిపెడితే మీరు లక్షాధికారులు కాగలరు.

తిండిగడవని ఉద్యోగం చేయడం బుద్ధిహీనత. ఇంత కంటే లక్ష పనులున్నాయ్. కన్నులు తెరచిచూడండి. మీరంతా ఒకటికండి. మీమాట మీషావుకార్లు వింటారు; తెరయ్యారా మీసమాధులను మీరే త్రవ్వుకున్న వాళ్ళౌతారు. తరువాత మీయిష్టం.

ఇలా కొన్నాళ్లు గడపండి. కొన్నాళ్ళంటే కొన్నాళ్లే. ఇంతలో స్వాతంత్ర్యం తప్పక వస్తుంది. సర్వమానవ సమత్వం నెలకొల్ప బడుతుంది... అపుడంతా భాగ్యవంతులే. సౌభాగ్యం మనది. రత్నాలు మనవి— భరతమాత ఆనాడు రత్నగర్భ అవుతుంది...

'ఐక్యతే బలం'



గుమాస్తాల సంఘం స్థాపించారు రత్తయ్యా సుబ్బన్నలు. రత్తయ్య కార్యదర్శి. సుబ్బన్న అధ్యక్షుడు. ఆసంఘంలో అలా ఉపన్యసించాడొక కళాశాలాధ్యాపకుడు.

వాళ్ళహృదయాలు ఉప్పొంగాయ్. వాళ్ళనగాలకు శక్తివచ్చింది. అంతా కలిసి జీతాలు ఎక్కువచేయమని అడగాలని బయలుదేరారు—



రత్తయ్య దయవల్ల సుబ్బన్న భద్రం షావుకారుదగ్గర పని మానేశాడు. లచ్చన్న శెట్టితో 'బేడ' వాటాకు చేరాడు. దానితో అతని దారిద్ర్యం పటాపంచలైపోయింది.



అదొక వ్రాతబల్ల, పుస్తకాలు పర్వతాల్లాగున్నాయ్ ఒక దానిపయి నొకటి. పద్దులు వ్రాయాలి. వ్రాయడానికి ఓపిక లేదు. ఆకలివేస్తుంది. ఏంచేస్తాడు. తలపట్టు కూర్చున్నాడు. ఇది పూర్వపు స్థితి—



అదొక సోఫా. టేబిల్ మీద ఫేను. వచ్చిన చెక్కులపయి సంతకం చేస్తున్నాడు. టేబిల్ మీదున్నా కాఫీ తాగి ప్యూనుకు ఇచ్చాడు. తెల్లని బట్టలు. కండలు తిరిగిన శరీరం— ఇది ఇప్పటిస్థితి ఇప్పుడు మన సుబ్బన్నను పోల్చుకోలేను— ఎంతలో ఎంతమార్పు.



"ఈసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయ్;
తిండి కలిగితె కండకలదోయ్
కండ కలవాడేను మనిషోయ్"

మహాకవి, శ్రీగురుజాడ అప్పారావుగారు

† † † † †

స మా ప్తి.

త్వరలో రాబోవు

శ్రీ మానాపురం అప్పారావు పట్నాయక్ వారి

నవల్సు.

---

1. డాన్సింగ్ మాష్టర్.
2. దొమ్మరిసాని.
3. రంగు మతాబా.
4. పత్క్రేంద్రుడు.



వలయు వారు,

వేంకటేశ్వర పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

# 1946లో

# జంపన వారి గ్రంథాలు

## వెలువడబోయేవి

1. దేవుడున్నాడా?
2. దేవుడు లంచగొండా?
3. దేవునికి పూజార్లెందుకు?
4. ఆచారా లెందుకు?
5. కులమతా లెందుకు?

♦ ♦ ♦

6. స్త్రీ-సంఘంలో బానిసా?
7. స్త్రీపిల్లల్ని కనేయంత్రమా
8. స్త్రీ-చదువుకొనరాదా?

♦ ♦

9. పేదసాదలు
10. కార్మికుల కష్టాలు
11. కర్షకుల నష్టాలు

♦ ♦ ♦

12. ఏకపత్నీ
13. నేటి బి. ఏ. లు
14. కోటివిద్యలు కూటికొరకే

♦ ♦ ♦

15. తల్లి లేని పిల్ల
16. కోటీశ్వరుడు
17. భూలోకస్వర్గం

♦ ♦ ♦

సోల్ డిస్ట్రిబ్యూటర్స్—

రాజహంస బుక్ డిపో, రాజమండ్రి.

విద్వాన్

# పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి

## కావ్యములు

| | | |
|---|---|---|
| 1. తూణీరం | (స్క్రిప్ట్) | 0 8 0 |
| 2. దేశం | (గేయాలు) | 0 8 0 |
| 3. నీలం | (కథలు) | 0 8 0 |
| 4. ఆంధ్రశ్రీ | (పద్యాలు) | 0 12 0 |
| 5. ఉషాసుందరి | (నాటకం) | 1 0 0 |

★ త్వరలో ★

| | |
|---|---|
| కవిరాజు | (నవల) |
| ఖడ్గతిక్కన | (జంగం కథ) |
| పైడిపాటి నాటికలు | (నాటికలు) |

పైడిపాటి ఆఫీస్

సుదురుమాటి బిల్డింగ్స్

బ్రాహ్మణవీథి-బెజవాడ

# 1946లో

## జంపన వారి గ్రంథాలు

### వెలువడినవి

1. శాస్త్రాలెందుకు?
2. గుమస్తా
3. ఎవరికి వారే యమునా తీరే
4. ముందడుగు

### వెలువడబోయేవి

1. దేవుడున్నాడా?
2. దేవుడు లంచగొండా?
3. దేవునికి పూజారులెందుకు?

◆ ◆

4. ఆచారాలెందుకు?
5. కులమతాలెందుకు?

◆ ◆

6. స్త్రీ-సంఘంలో బానిసా?
7. స్త్రీ పిల్లల్ని కనే యంత్రమా
8. స్త్రీ-చదువుకోరాదా?

◆ ◆

9. పేదసాదలు
10. కార్మికుల కష్టాలు
11. కర్షకుల కష్టాలు
12. ఎదురీత

◆ ◆

13. నేటి బి. ఏ. లు
14. కోటివిద్యలు కూటికొరకే

◆ ◆

15. తల్లి లేని పిల్ల
16. కోటీశ్వరుడు
17. భూలోక స్వర్గం

◆ ◆

హోల్ డిస్ట్రిబ్యూటర్సు—

**రాజహంస బుక్ డిపో, రాజమండ్రి**

Title Printed at 'RAJAHAMSA' Rjy. Q H. No. E. G. 54
Date 30-3-'46 Copies 1000.